# మనిషీ తెలుసుకో!

(నృత్య నాటిక)

శారదా అశోకవర్ధన్



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

హైదరాబాద్.

**MANISHEE TELUSUKO** (Dance Ballet)
By **SHARADA ASHOKAVVARDHAN**
*Published by :* Director & Special Officer, A.P. Baalala Akademi
% Jawahar Bal Bhavan, Public Gardens, Hyderabad - 500 004.

ప్రచురణ సంఖ్య : 101
మొదటి ముద్రణ : 1993
ప్రతులు : 5,000

వెల : 5-00

ముఖ చిత్రం,
లోపలి బొమ్మలు: ఆనంద్, ఎవిబిఎస్.

టైప్ సెట్టింగ్ :
గాయత్రి ఆర్ట్ ప్రింటర్స్,
5-9-33, బషీర్‌బాగ్,
హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 230210

ముద్రణ :
కార్డ్ బాక్స్ కంపెనీ
హైదరాబాద్.

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
జవహర్ బాల భవన్, పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాద్ 500 004.

# తొలిపలుకు

బాలలకు విద్యావైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీని స్థాపించింది. నాటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్యసాధనకోసం చేపట్టిన పథకాలలో బాల సాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

జవహర్ బాలభవన్ బాలల్లోని సృజనాత్మక కళలను ప్రోత్సహిస్తుంటే బాలభవన్‌లో మరొక భాగమైన బాలల అకాడమీ బాలల విజ్ఞానోదయానికి కృషి చేస్తున్నది. బాలల సమగ్ర అభ్యుదయానికి ఇవి రెండూ రెండుకళ్ళు వంటివి. విజ్ఞానానికి, వినోదానికి రెండూ ఒకే వేదికగా విరాజిల్లుతున్నాయి.

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు, సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవితచరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ఇకపై కూడా బాలలకు ఆసక్తిని కలిగించే పుస్తకాలను ప్రచురించే ప్రయత్నాలు చేస్తున్నాము. ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - మేము చేస్తున్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

**శారదా అశోకవర్ధన్**

సంచాలకులు మరియు ప్రత్యేకాధికారిణి

జవహర్ బాలభవన్, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

# ఇందులో పాత్రలు

1. సింహం
2. తేళ్ళు
3. కోతులు
4. ఏనుగు
5. గుంటనక్క
6. మనుషులు
7. నెమళ్ళు
8. రామచిలకలు
9. ఆవు
10. కోయిలలు
11. పావురం
12. పులి



## మనిషీ! తెలుసుకో!

కథనం : అనగనగా ఒక చిట్టడవి

కాకులు దూరని కారడ

లెక్కకు మించిన జంత

సఖ్యతగా ఉంటున్నా

చిరుతలు, ఎలుగులు,

పులులు, సింహాలు, ఖ

నక్కా, కుక్కా, పామూ

చిన్నా పెద్దా జంతువు

ఐక్యత మాకు ఊపిరనీ
స్వేచ్ఛయే మాకు సొంతమనీ
ఆడుతు పాడుతు ఉన్నాయి
ఆనందం తమ వరమన్నాయి.

*కోతి : (దండోరా వినండొహో! ఇందు మూలంగా మీ అందరికీ తెలియజేసేదేమనగా మండు టెండలో మారుమూల చెట్టుకింద అత్యావసర సమావేశం ఏర్పాటు చేశారండొహో కావున మీరంతా తప్పక హాజరు కావాలండొహో....*

అసలు సంగతి తెలియని మృగాలు
ఎండని, వానని ఆలోచించక
బిలబిలమంటూ వచ్చాయి
రాజు ఆజ్ఞను పాటించాయి.

## రెండవ దృశ్యం

*( సింహరాజు సభతీర్చి ఉంటాడు. జంతువులన్నీ అక్కడికి చేరుకుంటాయి. ఒక్కో జంతువు తమ గోడు మొరపెట్టుకో సాగాయి)*

లేడి : మండుటెండ మమ్మందరినీ
మలమల మని మాడుస్తుంటే
నీడ అన్నదే కరువయి పోయి
పిల్లా పీచు ఏడుస్తుంటే

కన్నవాళ్ళతో, ఉన్న వాళ్ళతో
ఉన్న పళానా రమ్మన్నారట
ఎందుకు రాజా ఈ సభ?
తెలియదా మీకు మా క్షోభ?



కోతి : చెట్లను పట్టుకు ఛెంగున దూకుతు
ఊయల లూగుతు ఉరకలు వేసే
ముద్దులొలుకుతూ ముచ్చట గొలిపే
మా బిడ్డలకు దిగులే మిగిలెను.

ఊయల లూగగ కొమ్మలు లేవు
ఆటలు ఆడగ చెట్లే లేవు
ఎండా వానకు అల్లల్లాడితే
నీడా గూడూ అసలే లేవు

పసికూనలతో, ముసలి వాళ్ళతో
ఉన్న పళానా రమ్మన్నారట
ఎందుకు రాజా ఈ సభ?
తెలియదా మీకు మా క్షోభ?

ఏనుగు : చిట్టీ పొట్టీ జంతువులన్నీ
గుట్టుగ ఎలాగో బతికేస్తున్నాయ్
భారీ కాయము దాచగలేక
ఎండకు మేము తాళగలేక

ఎన్నోపాట్లు పడుతున్నాము
విధిని మాటికీ తిడుతున్నాము
ఒంటి దురదను తీర్చుకొనేందుకు
చెట్ల మొదళ్ళే కరువయిపోతే

కుటుంబమంతా జాగుచేయక
ఉన్నపళానా రమ్మన్నారట
ఎందుకు రాజా ఈ సభ?
తెలియదా మీకు మా క్షోభ?



సింహం : అడవికి నేను రాజును కాదా!
తెలియదా నాకు మీ బాధ?
అయినా వచ్చెను ఒక విపత్తు
అందుకే పెట్టితి ఈ పరిషత్తు!

కలసికట్టుగా మనమందరము
ఒకే మాటగా, ఒకే బాటగా
కలిసి మార్గము అన్వేషించి
తొలగించుదాం ఆ విపత్తు!

కథనం : ఆతురతతో జంతువులన్నీ
రిక్కపొడుచుకొని వింటున్నాయి.
ఆపద ఏమిటో తెలియక పాపం
బిక్కు బిక్కుమని కూర్చున్నాయి.

సింహం : అడవులు నరుకుతు మనుషులిప్పుడు
అన్ని ప్రాంతాల కొచ్చారు
మనలను చూసిన నిముషములోనే
నిలువున ప్రాణం తీస్తున్నారు.

హృదయం లేని మనుషుల చేతిలో
కఠోర మరణం పొందుట కంటే
అడవిని వదలి వలసగ పోతే
హాయిగ బతుకును గడపొచ్చు.

అందుకే మిమ్ముల పిలిపించాను
ఉన్న పళానా రమ్మన్నాను.
ఏమంటారు మీరంతా?
మీరేదన్నా అవునంటా!



కథనం : అంటూ సింహం కూర్చుంది
సలహా కోసం వేచింది
మూలన ఉన్న గుంటనక్క
ఇలా పలికెను ఎంచక్కా!

గుంటనక్క : అయ్యా! అయ్యా! మృగరాజా!
ఒక ఆలోచన వచ్చింది
అడిగినందుకే చెపుతాను
అందరు కాస్త వినరండి

మన బాధల పట్టిక తయారు చేసి
మనుషుల కమిటీ కది అందిస్తే
దయతో వారు స్వీకరించరా?
న్యాయం మనకు చేకూర్చరా?

కథనం : నక్క చెప్పిన ఉపాయానికి
జంతువు లన్ని సరే సరే అన్నవి
సింహం కూడా భళీ! అన్నది.
పావురాయిని చేరబిలిచినది

ఏనుగు : పావురమా! ఓ పావురమా!

అడవులలోనా ఇడుముల పడుతూ
కడకు విసిగిన మన గాధలను
మనుషుల కమిటీకిచ్చి వచ్చెదవా?

కథనం : పావురాన్ని రాయబారిగా

మనుషుల కడకు పంపాయి
ఫలితం కొరకు రేయింపవలు
పడిగాపులనే కాశాయి.



వచనం : పావురం రాయబారిగా వెళ్ళితిరిగి వచ్చింది. మనుషుల కమిటీకి తమ నివేదికను ఇచ్చినట్లు, వారు ఒక వారం లోగా ఇక్కడకు వచ్చి, తమ బాధలన్నిటిని పరిశీలించి న్యాయంచేకూరుస్తామని చెప్పి నట్లు చెప్పింది. జంతువులన్నీ ఆనందంతో ఎగిరి గంతేసాయి.

రారాజు సింహం మనుషుల కమిటీకి స్వాగతం చెప్పడానికై జంతువులన్నింటికీ ఆదేశాలు జారీ చేసింది. రకరకాల పను లను వాటికి అప్పజెప్పింది.

వారం రోజులు గడవకముందే
ఆవనజీవులకు సంబంధించిన
దర్యాప్తును కొనసాగించడానికి
మనుషుల కమిటీ వచ్చింది

ఆ అడవి జంతువులన్నీ వారికి ఘనస్వాగతం పలికాయి.

రామచిలకల స్వాగత పలుకులు
ఎంతో ముదము చేకూర్చగా
గండుకోయిలల స్వరాలాపనలు
నెమళ్ళ నృత్యం,
కోతుల లయవిన్యాసం
పాము ప్రదర్శన
కలిగించాయి కనుల విందు.
పరిపరి విధాల పలు జంతువులు



మనుషుల మనసులు ఆనందంతో
పరవశమందిన అనంతరం
మృగరాజేమో ముందుకు వచ్చి
మనుషుల కమిటికి వివరించెను

సింహం : మనుషుల్లారా! మనుషుల్లారా!
మా బాధల పట్టిక పరిశీలించి
తగిన న్యాయము చేయండి
కష్టాలన్నిటి తీర్చండి

కథనం : అంతలోనే జరిగిందొక వింత
హా హా కారాలతో అడివంతా
అల్లకల్లోలమై నిండిపోయెను
అంతా అటుగా చూడసాగిరి

'అంబా!' అంటూ ఆవు ఒకటి
వచ్చి చేరెను అక్కడికి
మరొక ఆవు తన్నినదంటూ
న్యాయ విచారణ కోరింది.

సింహం కాస్తా ఆలోచించి
తీర్పు చెప్పేలోగా మనుషులు
తమకి తాముగా కలుగజేసుకొని
ఆవుని ఇలాగ అడిగారపుడు

మనుషులు : ఓ ఆవూ! ఓ ఆవూ!
మా ప్రశ్నలకు జవాబు చెప్పు
ఉన్నది ఉన్నట్లుగానే చెప్పు
లేనిది లేనట్లుగానే చెప్పు



కథనం : భయపడుతూనే సరేనన్నది
ఆవు మెల్లగా తల ఆడిస్తూ
తన వాదనను వివరించింది
న్యాయం కోసం కలవరించింది

మనుషులు : ఓ ఆవూ! ఓ ఆవూ!
వేరే ఆవుది-నీదీ కూడా
కులము, మతము ఒకటేనా?
గోత్రం, శాస్త్రం ఒకటేనా?

ముందీ ప్రశ్నకు బదులిస్తే
పరిష్కారము చిటికెలో చేస్తాం
ఆలోచించి చెపితే చాలు
అందాలొలికే న్యాయం చెపుతాం!

కథనం : మనుషుల మాటలు విన్న ఆవుకి
మతిపోయింది మరుక్షణంలో
మనుషుల్లోనూ జంతువులాంటి
వారుంటారని తాను విన్నది!

కానీ యిప్పుడు అర్థం కానిది
జంతుజాతిలో మతాలుండటం
గోవులలోనూ గోత్రం వెతుకుట
తికమక పడినది ఆ ఆవు

అర్థంలేని ప్రశ్నలు వేసే
మనుషుల పట్ల అసహ్యమేసి
ఆవేశంతో సింహం లేచెను
పళ్ళు పటపటకొరికి అరచెను.



సింహం : భారతమాతను బందీ చేసి
తెల్లవారలు రాజ్యమేలగా
భారతదేశము ఏకకంఠముతో
"మేమంతా భారతీయులమన్నది"

"స్వరాజ్యం మా జన్మ హక్కు"ని
ఆడ మగ యనే తేడా లేకను
అంతరాల భేదము లేకను
కార్యదీక్షతో కదిలారంతా!

స్వాతంత్ర్యం తెచ్చి పెట్టి
తెల్లవారిని తరిమి కొట్టి
భరతమాతకు పట్టం కట్టిన
మహనీయులున్నా రెందరో!

కాల గర్భాన కలిసిరి వారు
స్వార్థం నిండిన కొందరు నేతలు
తల్లిరొమ్ము నే గుద్ది నారులే
నమ్మక ద్రోహం చేసినారులే!

ఏనుగు : మతం పేరిట కులం పేరిట
మానవత్వము మంట గలిపిరి
మారణహోమం చేసినారులే
మంచికి మంగళహారతి పాడిరి!

రక్తంతోనూ తర్పణ చేస్తూ
విలువలకేమో శిలువలు వేస్తూ
అభిమానాలను హరింపజేస్తూ
అమ్మ గుండెలో మంటలు రేపిరి!



అక్రమానిదే రాజ్యం! రాజ్యం!
ఐకమత్యమే పూజ్యం! పూజ్యం!
మాకు నీతులు చెప్పేముందు
మిమ్ముల మీరు చూసుకొనండి!

నెమళ్ళు : మమ్ముల ఒకటిగ నడిపే సూత్రం
ఐక్యత అనేదే తారకమంత్రం!
మీలో లేనిది మాలో ఉన్నది
మనసుల కలిపే మమతా తత్వం!

పర్యావరణం రక్షించాలని
గొంతుచించుకుని చెబుతునే
చెట్లు, అడవులు నరుకుతు మీరు
మాట తప్పిన మానవులు

జంతువులన్ని జాతి సంపదని
తీయని కబుర్లు చెబుతూనే
మా బతుకులతోటి ఆటలాడే
వంచకులండీ మీరంతా

చిలుకలు : మనుషుల్లారా! మనుషుల్లారా!
నీతి బాహ్యాపు జీవుల్లారా!
మీ నీతులు మా కడ వల్లించొద్దు
మీ గుణాలు మాలో వెదజల్లొద్దు

సింహం : మా జంతు జాతిని కలుషితం చేయక
మా ఐకమత్యమును విచ్ఛిన్నపరచక
మా బాటలో మమ్ము బతకనీయండి
మనుషులూ! శతకోటి దణ్ణాలు మీకు!



కథనం : దిక్కులు అదిరే సింహ గర్జనకు
మనుషులు బెదిరి పోయిరి
మనుషుల కంటే జంతువు నయమని
తలచి సిగ్గుతో క్రుంగి పోయిరి.

జంతువులు: మనుషుల కంటే మృగాలు నయము
వాటిని చూసి మనిషి నేర్వవలె
ఐకమత్యము జాతీయత్వము
అందరు ఒకటను నినాదము!
అందరు ఒకటను నినాదము
అందరు ఒకటను నినాదము.